# అర్థ - తాత్పర్యములు

(రంగస్థలము పైకి సూత్రధారుడు ప్రవేశించును)

**सूत्रधारः-**

సూత్రధారః -

नरमृगपतिवर्ष्मालोकनभ्रान्तनारी-
नरदनुजसुपर्वव्रातपाताललोकः ।
करजकुलिशपालीभिन्नदैत्येन्द्रवक्षाः
सुररिपुबलहन्ता श्रीधरोऽस्तु श्रिये वः ॥ ॥ 1 ॥

నరమృగపతివర్ష్మాలోకనభ్రాంతనారీ
నరదనుజసువర్వవ్రాతపాతాలలోకః।
కరజకులిశపాలీభిన్నదైత్యేంద్రవక్షాః
సురరిపుబలహన్తా శ్రీధరో ఽస్తు శ్రియే వః ॥ 1 ॥

అర్థములు : नरमृगपति = నరసింహరూపమైన, वर्ष्म = ఆకృతిని, आलोकन = చూచుటచే, भ्रान्त = ఆశ్చర్యపడిన, नारी = స్త్రీలను, नर = మనుష్యులను, दनुज = రాక్షసులను, सुपर्व = దేవతలయొక్క, व्रात = సమూహమును, पाताललोकः = పాతాళలోకమును కలిగినవాడు, करजकुलिश = వజ్రాయుధము వంటి గోళ్ళయొక్క पाली = సమూహముచే, भिन्न = చీల్చబడిన, दैत्येन्द्र = రాక్షసరాజు యొక్క, वक्षाः = వక్షః స్థలముగలవాడు, सुररिपु = దేవతల శత్రువులైన రాక్షసుల యొక్క, बल = బలమును, हन्ता = హరించువాడు, श्रीधरः = విష్ణువు, वः = మీ యొక్క, श्रिये = సంపదకొరకు, శుభము కొరకు, अस्तु = ఉండుగాక!

తాత్పర్యము : ఎవని నరసింహరూపమును చూచి మానవులు, స్త్రీలు, రాక్షసులు, దేవతలు, పాతాళలోకవాసులు ఆశ్చర్యపడిరో, ఎవడు వజ్రాయుధము వంటి వాడిగోళ్ళతో రాక్షసేంద్రుని వక్షఃస్థలమును చీల్చెనో, ఎవడు రాక్షసుల బలమును హరించువాడో, అట్టి శ్రీవిష్ణువు మీకు సంపదల నిచ్చుగాక!

एवमार्यमिश्रान्विज्ञापयामि। (परिक्रम्य, कर्णं दत्वा) अये किं नु खलु मयि विज्ञापनव्यग्रे शब्द इव श्रूयते। अङ्ग ! पश्यामि।

ఏవమార్యమిశ్రాన్విజ్ఞాపయామి. (పరిక్రమ్య, కర్ణం దత్వా) అయే కిం ను ఖలు మయి విజ్ఞాపనవ్యగ్రే శబ్ద ఇవ శ్రూయతే. అఙ్గ ! పశ్యామి.

**తాత్పర్యము :** పూజనీయులకు యిట్లు విన్నవించుచున్నాను. (పరికించి, విని) అరే! నేను విన్నవించదలచుచుండగా శబ్దమువలె వినబడుచున్నది. ఆఁ! చూచెదను.

**( नेपथ्ये** = నేపథ్యమున)

भो भो: ! निवेद्यतां निवेद्यतां महाराजायाङ्गेश्वराय।

(భో భోః ! నివేద్యతాం నివేద్యతాం మహారాజాయాంగేశ్వరాయ.)

ఓయీ! మహారాజైన అంగదేశాధిపతికి నివేదించబడుగాక! నివేదించబడుగాక!

**सूत्रधार:** – भवतु विज्ञातम्।

**संग्रामे तुमुले जाते कर्णाय कलिताञ्जलि:।**
**निवेदयति संभ्रान्तो भृत्यो दुर्योधनाज्ञया॥** ॥ 2 ॥

**సూత్రధారః** – భవతు విజ్ఞాతమ్.

సంగ్రామే తుములే జాతే కర్ణాయ కలితాంజలిః
నివేదయతి సంభ్రాన్తో భృత్యో దుర్యోధనాజ్ఞయా॥ ॥2॥

**అర్థములు :** भवतु = కానిమ్ము, तुमुले जाते = భయంకరము కాగా, कलित + अंजलि: = అంజలిపట్టినవాడై అనగా చేతులను జోడించినవాడై.

**తాత్పర్యము :** సరే కానిమ్ము. తెలిసినది. యుద్ధము భయంకరము కాగా, సేవకుడు దుర్యోధనుని ఆజ్ఞతో సంభ్రాంతుడై చేతులను జోడించి కర్ణునకు నివేదించుచున్నాడు.

(निष्क्रान्त:) (నిష్క్రాన్తః)

(నిష్క్రమించెను.)

**प्रस्तावना।** (ప్రస్తావనా)

ప్రస్తావన **అనగా** –

నాటకారంభమున సూత్రధారుడు నటితోగాని, నటునితోగాని నాటక కథాంశమును ప్రస్తావించుట.

(तत: प्रविशति भट:) (తతః ప్రవిశతి భటః)

(తరువాత భటుడు ప్రవేశించును.)

भटः – भो भोः ! निवेद्यतां निवेद्यतां महाराजायाङ्गेश्वराय युद्धकाल उपस्थित इति।

భటః – భో భోః! నివేద్యతాం నివేద్యతాం మహారాజాయాంగేశ్వరాయ యుద్ధకాల ఉపస్థిత ఇతి.

'ఓయీ! యుద్ధ సమయమాసన్నమైనద'ని మహారాజైన అంగేశ్వరునకు నివేదించబడుగాక! నివేదించబడుగాక!

करितुरगरथस्थैः पार्थकेतोः पुरस्तात्
मुदितनृपतिसिंहैः सिंहनादः कृतोद्य।
त्वरितमरिनिनादैर्दुस्सहालोकवीरः
समरमधिगतार्थः प्रस्थितो नागकेतुः॥ ॥3॥

కరితురగరథస్థైః పార్థకేతోః పురస్తాత్
ముదితనృపతిసింహైః సింహనాదః కృతోద్య।
త్వరితమరినినాదైర్దుస్సహాలోకవీరః
సమరమధిగతార్థః ప్రస్థితో నాగకేతుః॥ ॥ 3 ॥

అర్థములు : पुरस्तात् = ముందు, अरिनिनादैः = శత్రువుల యొక్క నినాదములచే, दुस्सह + आलोकवीरः = సహింపరాని పరాక్రమముగల వీరుడు, अधिगत + अर्थः = తెలుసుకొనబడిన ప్రయోజనము గలవాడై, प्रस्थितः = బయలుదేరెను, नागकेतुः = నాగము ధ్వజమందుగలవాడు.

తాత్పర్యము : పార్థుని ముందు నేడు ఏనుగులపై, గుఱ్ఱములపై, రథములందును ఉన్నవారైన, సంతసించిన రాజశ్రేష్ఠులచే సింహనాదములు చేయబడుచున్నవి. ఆ శత్రువుల నినాదములను విని సహింపరాని పరాక్రమముగల వీరుడు, నాగధ్వజుడునైన సుయోధనుడు ప్రయోజనము నెరిగి వెంటనే యుద్ధరంగమునకు బయలుదేరెను.

( परिक्रम्य विलोक्य ) अये अयमङ्गराजः समरपरिच्छदपरिवृतः शल्यराजेन सह स्वभवनान्निष्क्रम्येत एवाभिवर्तते। भोः! किं नु खलु युद्धोत्सवप्रमुखस्य दृष्टपराक्रमस्याभूतपूर्वो हृदयपरितापः। एष हि —

(పరిక్రమ్య విలోక్య) అయే అయమంగరాజః సమరపరిచ్ఛదపరివృతః శల్యరాజేన సహ స్వభవనాన్నిష్క్రమ్యేత ఏవాభివర్తతే. భోః ! కిం ను ఖలు యుద్ధోత్సవప్రముఖస్య దృష్టపరాక్రమస్యాభూతపూర్వో హృదయపరితాపః ఏష హి –

**అర్థములు :** परिक्रम्य = పరికించి, विलोक्य = చూచి, अयम् = ఈ, अंगराज: = అంగదేశము యొక్క రాజు (కర్ణుడు), समरपरिच्छद = యుద్ధాలంకారములతో (కవచము మున్నగువాటితో), परिवृत: = కూడినవాడై, शल्यराजेन सह = శల్యుడను రాజుతో కలసి, स्वभवनात् = తన భవనము నుండి, निष्क्रम्य = బైటకు వచ్చి, इत: एव = ఇటువైపునకే, अभिवर्तते = కదలుచున్నాడు, भो: = ఓయి, युद्ध + उत्सवप्रमुखस्य = యుద్ధమునకు సంబంధించిన సంరంభమున ప్రముఖుడు, दृष्टपराक्रमस्य = చూడబడిన పరాక్రమము గలవాడు అయిన కర్ణునకు, अभूतपूर्व: = అపూర్వమైన (ఇంతకు ముందులేని), हृदयपरिताप: = మనస్తాపము, कि नु खलु = ఏమిటో కదా! (ఎందులకు కలిగెనో!), एष हि = ఇతడు.

**తాత్పర్యము :** (పరికించి, చూచి) అరె! ఇదిగో అంగరాజు యుద్ధాలంకారములతో కూడినవాడై శల్యునితో కలసి తన భవనము నుండి యిటే వచ్చుచున్నాడు. అరె! పరాక్రమమును ఎరిగినవాడు, యుద్ధ సంరంభమున ప్రధానుడునైన యితనికి అపూర్వమైన యీ మనస్తాపమేమి? ఇతడు –

अत्युग्रदीप्तिविशद: समरेऽग्रगण्य:
शौर्यं च संप्रति सशोकमुपैति धीमान्।
प्राप्ते निदाघसमये घनराशिरुद्ध:
सूर्य: स्वभावरुचिमानिव भाति कर्ण: ॥ ॥4॥

అత్యుగ్రదీప్తివిశదః సమరేఽగ్రగణ్యః
శౌర్యం చ సంప్రతి సశోకముపైతి ధీమాన్।
ప్రాప్తే నిదాఘసమయే ఘనరాశిరుద్ధః
సూర్యః స్వభావరుచిమానివ భాతి కర్ణః॥ ॥ 4 ॥

**అర్థములు :** अत्युग्र दीप्ति = మిక్కిలి ఉజ్వలమైన కాంతిచే, विशद: = స్పష్టముగా ప్రకాశించువాడు, संप्रति = నేడు, सशोकम् = దుఃఖముతో (వేదనతో), उपैति = వచ్చుచున్నాడు, निदाघसमये = వేసవికాలము, प्राप्ते = ప్రాప్తించగా, घनराशि = మేఘముల సమూహముచే, रुद्ध: = అడ్డగించబడినవాడు, स्वभाव = సహజముగా, रुचिमान् = కాంతిగలవాడు, भाति = ప్రకాశించుచున్నాడు.

**తాత్పర్యము :** మిక్కిలి ఉజ్వలమైన కాంతిచే స్పష్టముగా ప్రకాశించువాడు, యుద్ధమున పరాక్రమమందును అగ్రగణ్యుడు, ధీమంతుడునైన కర్ణుడు నేడు వేదనతో వచ్చుచున్నాడు. అతడిప్పుడు వేసవికాలమున మబ్బులచే కప్పబడిన సహజముగా తేజోవంతుడైన సూర్యునివలె ప్రకాశించుచున్నాడు.

यावदपसर्पामि। (निष्क्रान्तः)

యావదపసర్పామి. (నిష్క్రాన్తః)

यावत् + अपसर्पामि = ఇక తొలగిపోయెదను.

(निष्क्रान्तः = నిష్క్రమించును.)

(ततः प्रविशति यथानिर्दिष्टः कर्णः शल्यश्च।)

(తతః ప్రవిశతి యథానిర్దిష్టః కర్ణః శల్యశ్చ.)

यथानिर्दिष्टः = నిర్దేశించిన విధముగా (పైన చెప్పిన విధముగా)

**భావము :** (అటు పిమ్మట, నిర్దేశించినట్లు కర్ణుడు, శల్యుడు ప్రవేశించుదురు.)

**कर्णः –** मा तावन्मम शरमार्गलक्ष्यभूताः
संप्राप्ताः क्षितिपतयः सजीवशेषाः।
कर्तव्यं रणशिरसि प्रियं कुरूणां
द्रष्टव्यो 'यदि' भवेद्धनंजयो मे ॥ ॥5॥

కర్ణః – మా తావన్మమ శరమార్గలక్ష్యభూతాః
సంప్రాప్తాః క్షితిపతయః సజీవశేషాః।
కర్తవ్యం రణశిరసి ప్రియం కురూణాం
ద్రష్టవ్యో 'యది' భవేద్ధనంజయో మే ॥ 5 ॥

**అర్థములు :** सम्प्राप्ताः = పొందబడినవారు, मम = నా యొక్క, शरमार्ग = బాణముల మార్గమందు, लक्ष्यभूताः = గురియైనవారు, क्षितिपतयः = రాజులు, मा तावत् सजीवशेषाः = ప్రాణములతో మిగిలినవారు కారాదు, सः धनंञयः = ఆ అర్జునుడు, मे = నాకు, यदि द्रष्टव्यः भवेत् = కనిపించినచో, रणशिरसि = యుద్ధరంగమున, कुरूणां = కౌరవులకు, प्रियं = ఇష్టమైనది, कर्तव्यम् = చేయదగినది.

**తాత్పర్యము :** శల్యరాజ! నాచే పొందబడి నా బాణములకు గురియైన రాజులు ప్రాణములతో తిరిగి వెళ్ళరాదు. ఆ అర్జునుడు నాకు కనిపించినచో యుద్ధరంగమున కౌరవులకు ప్రియమును చేకూర్చెదను.

అనగా అర్జునుని జయించెదనని భావము. అర్జునుని జయించుటయే కౌరవులకు ప్రియమైనది కదా!

शल्यराज ! यत्रासावर्जुनस्तत्रैव चोद्यतां मम रथः ।

(శల్యరాజ ! యత్రాసావర్జునస్తత్రైవ చోద్యతాం మమ రథః.)

**తాత్పర్యము :** ఓ. శల్యరాజ! అర్జునుడు ఎక్కడ కలడో, అక్కడకు రథమును నడుపుము.

**शल्यः** - बाढम् । (चोदयति)

**శల్యః** - బాఢమ్. (చోదయతి)

సరే.(OK) (రథమును నడుపును)

**कर्णः** - अहो नु खलु, भोः कष्टम् ।

**కర్ణః** - అహో ను ఖలు, భోః కష్టమ్.

అహో! ఏమి యిది - అయ్యో! కష్టము.

**पूर्वं कुन्त्यां समुत्पन्नो राधेय इति विश्रुतः ।**
**युधिष्ठिरादयस्ते मे यवीयांसस्तु पाण्डवाः ॥ ॥6॥**

పూర్వం కున్త్యాం సముత్పన్నో రాధేయ ఇతి విశ్రుతః
యుధిష్ఠిరాదయస్తే మే యవీయాంసస్తు పాండవాః॥ ॥ 6 ॥

**అర్థము :** यवीयांसः = కనిష్ఠులు.

**తాత్పర్యము :** పూర్వము నేను కుంతిదేవియందు జన్మించినవాడనై రాధేయునిగా ప్రసిద్ధి చెందితిని. కాని యుధిష్ఠిరుడు మొదలైన పాండవులు నాకు కనిష్ఠులు (తమ్ముళ్ళు) అగుచున్నారు.

**अयं स कालः क्रमलब्धशोभनो**
**गुणप्रकर्षो दिवसोऽयमागतः ।**
**निरर्थमस्त्रं च मया हि शिक्षितं**
**पुनश्च मातुर्वचनेन वारितः ॥ ॥7॥**

అయం స కాలః క్రమలబ్ధశోభనో
గుణప్రకర్షో దివసోఽయమాగతః
నిరర్థమస్త్రం చ మయా హి శిక్షితం
పునశ్చ మాతుర్వచనేన వారితః ॥ ॥ 7 ॥

**తాత్పర్యము :** నేను చాల కాలము నుండి ఎదురుచూచుచున్న సమయము (యుద్ధ సమయము) క్రమముగా యిప్పటికి రూపుదిద్దుకొన్నది. గుణాధిక్యము గల దినమిది. కాని నేను నిష్ఫలమైన అస్త్రవిద్యను అభ్యసించితిని. మరియు తల్లి మాటచే వారించబడితిని.

యుధిష్ఠిరుడు మున్నగువారిపై అస్త్రములను సంధించకూడదని తల్లి (కుంతి) పలుకగా కర్ణు డంగీకరించెను.

**भो: शल्यराज! श्रूयतां ममास्त्रस्य वृत्तान्तः।**

**భోః శల్యరాజ ! శ్రూయతాం మమాస్త్రస్య వృత్తాన్తః.**

**భావము :** ఓ శల్యరాజా! నా అస్త్రాభ్యాస వృత్తాంతమును వినుము.

**शल्य:** - ममाप्यस्ति कौतूहलमेनं वृत्तान्तं श्रोतुम्।

**శల్యః** - మమాప్యస్తి కౌతూహలమేనం వృత్తాన్తం శ్రోతుమ్.

**భావము :** నాకు కూడ యీ వృత్తాంతమును వినుటకు కుతూహలము కలదు.

**कर्ण:** - पूर्वमेवाहं जामदग्न्यस्य सकाशं गतवानस्मि।

**కర్ణః** - పూర్వమేవాహం జామదగ్న్యస్య సకాశం గతవానస్మి.

**భావము :** పూర్వమే నేను జమదగ్ని కుమారుడైన పరశురాముని వద్దకు వెళ్ళితిని.

**शल्य:** - ततस्ततः।

**శల్యః** - తతస్తతః.

తరువాత తరువాత.

**कर्ण:** - ततो जामदग्निना ममाशीर्वचनं दत्वा पृष्टोऽस्मि। को भवान् किमर्थमिहागत इति।

**కర్ణః** - తతో జామదగ్నినా మమాశీర్వచనం దత్వా పృష్టోఽస్మి. కో భవాన్ కిమర్థమిహాగత ఇతి.

पृष्ट: अस्मि = అడుగబడితిని.

**భావము :** తరువాత పరశురాముడు నాకు ఆశీర్వచనమిచ్చి అడిగెను - "నీవెవడవు? ఎందులకు యిక్కడకు వచ్చితివి?" అని.

शल्यः - ततस्ततः।

శల్యః - తతస్తతః.

తరువాత తరువాత.

कर्णः - ततः भगवन् अखिलान्यस्त्राण्युपशिक्षितुमिच्छामीत्युक्त - वानस्मि।

కర్ణః - తతః భగవన్ అఖిలాన్యస్త్రాణ్యుపశిక్షితుమిచ్ఛామి ఇత్యుక్తవానస్మి.

భావము : తరువాత, "పూజ్యుడా! అస్త్రములన్నింటిని నేర్చుకొనుటకు ఇష్టపడుచున్నాను" అని పలికితిని.

शल्यः - ततस्ततः।

శల్యః - తతస్తతః.

తరువాత, తరువాత.

कर्णः - ततः उक्तोऽहं भगवता ब्राह्मणेषूपदेशं करिष्यामि, न क्षत्रियाणामिति।

కర్ణః - తతః ఉక్తోఽహం భగవతా బ్రాహ్మణేషూపదేశం కరిష్యామి, న క్షత్రియాణామితి.

భావము : తరువాత, పూజ్యుడు నాతో ఇట్లనెను, "బ్రాహ్మణులకు ఉపదేశము చేసెదను, క్షత్రియులకు కాదు."

शल्यः - अस्ति खलु भगवतः क्षत्रियवंश्यैः पूर्ववैरम्। ततस्ततः।

శల్యః - అస్తి ఖలు భగవతః క్షత్రియవంశ్యైః పూర్వవైరం. తతస్తతః.

భావము : పూజ్యునకు క్షత్రియ వంశీయులతో పూర్వశత్రుత్వము కలదు కదా! తరువాత తరువాత ...

कर्णः - ततो नाहं क्षत्रिय इत्यस्त्रोपदेशं ग्रहीतुमारब्धं मया।

కర్ణః - తతో నాహం క్షత్రియ ఇత్యస్త్రోపదేశం గ్రహీతుమారబ్ధం మయా.

భావము : అంతట "నేను క్షత్రియుడను కాను" అని చెప్పి అస్త్రోపదేశమును స్వీకరించుటకు ప్రారంభించితిని.

शल्यः - ततस्ततः।

శల్యః - తతస్తతః.

తరువాత తరువాత.

कर्णः - ततः कतिपयकालातिक्रमे कदाचित्फलमूलसमित्कुश-कुसुमाहरणाय गतवता गुरुणा सहानुगतोऽस्मि।

కర్ణః - తతః కతిపయకాలాతిక్రమే కదాచిత్ఫలమూలసమిత్కుశ - కుసుమాహరణాయ గతవతా గురుణా సహానుగతో ఽస్మి.

భావము : అటు పిమ్మట కొంతకాలము గడచిపోగా, ఒకనాడు ఫలములను, దుంపలను, సమిధలను, దర్భలను, పూలను తెచ్చుటకు వెళ్ళిన గురువుతో కలసి అనుసరించి వెళ్ళితిని.

शल्यः - ततस्ततः।

శల్యః - తతస్తతః.

తరువాత తరువాత.

कर्णः - ततः स गुरुर्वनभ्रमणपरिश्रमान्मदङ्के निद्रावशमुपगतः।

కర్ణః - తతః స గురుర్వనభ్రమణపరిశ్రమాన్మదంకే నిద్రావశముపగతః.

భావము : అంతట గురువైన ఆ పరశురాముడు అడవిలో తిరుగుటచే కలిగిన అలసట వలన నా ఒడిలో నిద్రావశుడయ్యెను.

शल्यः - ततस्ततः।

శల్యః - తతస్తతః.

తరువాత తరువాత.

कर्णः - ततः

कृत्ते वज्रमुखेन नाम कृमिणा दैवान्ममरोरुद्वये
निद्राच्छेदभयादसह्यत गुरोर्धैर्यात्तदा वेदना।
उत्थाय क्षतजाप्लुतः स सहसा रोषानलोद्दीपितो
बुध्वा मां च शशाप कालविफलान्यस्त्राणि ते सन्त्विति ॥10॥

కర్ణః - తతః

కృత్తే వజ్రముఖేన నామ కృమిణా దైవాన్మమోరుద్వయే
నిద్రాచ్ఛేదభయాదసహ్యత గురోర్ధైర్యాత్తదా వేదనా।
ఉత్థాయ క్షతజాప్లుతః స సహసా రోషానలోద్దీపితో
బుధ్వా మాం చ శశాప కాలవిఫలాన్యస్త్రాణి తే సన్త్వితి ॥ 10 ॥

**అర్థములు :** అంతట, ऊरुद्वये = రెండు తొడలయందు, वज्रमुखेन नाम = వజ్రముఖము అను పేరుగల, कृमिणा = కీటకముచే, कृत्ते (सति) = కాటువేయబడగా, गुरो: = గురువు యొక్క निद्राच्छेदभयात् = నిద్రాభంగ భయమువలన, असह्यत = సహింపబడెను, स: = ఆ పరశురాముడు, क्षतज + आप्लुत: = గాయము నుండి కారిన రక్తమందు మునిగినవాడై అనగా రక్తముచే తడసినవాడై, सहसा = వెంటనే, उत्थाय = లేచి, बुध्वा = తెలుసుకొని, मां = నన్ను, शशाप = శపించెను, ते = నీ యొక్క अस्त्राणि = అస్త్రములు, कालविफलानि = ప్రయోగించు కాలమున విఫలములు, सन्तु = అగుగాక!

**భావము :** అంతట, దైవవశము వలన వజ్రముఖమను కీటకము నా రెండు తొడలయందు కాటువేయగా, అప్పుడు గురువునకు నిద్రాభంగము కలగునను భయము వలన ధైర్యముతో ఆ బాధను సహించితిని. గాయమునుండి కారిన రక్తములో తడిసిన గురుదేవుడు వెంటనే మేల్కొని పైకి లేచి నన్ను క్షత్రియునిగా తెలుసుకొని రోషాగ్నిచే జ్వలించినవాడై "నీ అస్త్రములు ప్రయోగకాలమున విఫలములగు గాక!" అని నన్ను శపించెను.

शल्य: - अहो कष्टमभिहितं तत्रभवता।

శల్యః - అహో కష్టమభిహితం తత్రభవతా.

**భావము :** అయ్యో! పూజ్యునిచే కష్టముగా పలుకబడినది.

कर्ण: - परीक्षामहे तावदस्त्रस्य वृत्तान्तम्। (तथा कृत्वा) एतान्यस्त्राणि निर्वीर्याणीव लक्ष्यन्ते। अपि च।

కర్ణః - పరీక్షామహే తావదస్త్రస్య వృత్తాన్తమ్. (తథా కృత్వా) ఏతాన్యస్త్రాణి నిర్వీర్యాణీవ లక్ష్యన్తే. అపి చ.

**భావము :** ఇక అస్త్రవృత్తాంతమును పరీక్షించుదము. (ఆ విధముగా చేసి) ఈ అస్త్రములు శక్తిహీనములవలె కన్పట్టుచున్నవి.

इमे तुरङ्गमाः गजाश्च दैन्येन स्खलन्तः रणे निवर्तनं निवेदयन्ति।

ఇమే తురఙ్గమాః గజాశ్చ దైన్యేన స్ఖలన్తః రణే నివర్తనం నివేదయన్తి.

**భావము :** ఈ అశ్వములు, ఏనుగులు దైన్యముతో తడబడుచు, యుద్ధంలో వెనుకకు మరలుటను తెలుపుచున్నవి.

शङ्खदुन्दुभयश्च निःशब्दाः।

శంఖదుందుభయశ్చ నిశ్శబ్దాః.

**భావము :** శంఖములు, దుందుభులు కూడ నిశ్శబ్దములగుచున్నవి.
దుందుభి = Drum అను వాద్య విశేషము.

**शल्यः** - भोः कष्टं किं नु खल्विदम्।

**శల్యః** - భోః కష్టం కిం ను ఖల్విదమ్.

**భావము :** ఓ మహారాజ! ఎంత కష్టము! ఇది యేమిటో కదా!

**कर्णः** - शल्यराज! अलमलं विषादेन।

**కర్ణః** - శల్యరాజ ! అలమలం విషాదేన.

**భావము :** ఓ శల్యరాజ! చాలు చాలు విషాదము.

**हतोऽपि लभते स्वर्गं जित्वा तु लभते यशः।**
**उभे बहुमते लोके नास्ति निष्फलता रणे॥ ॥ 11 ॥**

**హతోऽపి లభతే స్వర్గం జిత్వా తు లభతే యశః।**
**ఉభే బహుమతే లోకే నాస్తి నిష్ఫలతా రణే॥ ॥ 11 ॥**

**అర్థములు :** हतः + अपि = మరణించినను, लभते = పొందును, जित्वा तु = జయించినచో, उभे = రెండు, बहुमते = కీర్తించదగినవి, नास्ति = न + अस्ति = లేదు.

**భావము :** వీరుడు యుద్ధమున మరణించినను స్వర్గమును పొందును. జయించినచో కీర్తిని పొందును. రెండు కూడ లోకమున కీర్తించదగినవే. కావున యుద్ధ విషయమున నిష్ఫలత్వము లేదు.

अक्षयोऽस्तु गोब्राह्मणानाम्। अक्षयोऽस्तु पतिव्रतानाम्। अक्षयोऽस्तु रणेष्वपराङ्मुखानां यौधपुरुषाणाम्। अक्षयोऽस्तु मम प्राप्तकालस्य। एष भोः प्रसन्नोऽस्मि।

అక్షయోఽస్తు గోబ్రాహ్మణానామ్. అక్షయోఽస్తు పతివ్రతానామ్. అక్షయోఽస్తు రణేష్వపరాఙ్ముఖానాం యోధపురుషాణామ్. అక్షయోఽస్తు మమ ప్రాప్తకాలస్య. ఏష భోః ప్రసన్నోఽస్మి.

**అర్థములు :** अक्षय: + अस्तु = శ్రేయస్సు కలుగుగాక!, रणेषु + अपराङ्मुखानाम् = యుద్ధములందు వెనుకకు తిరుగని వారికి, मम = నాకు, प्राप्तकालस्य = ప్రాప్తించిన కాలమునకు.

**భావము :** గో- బ్రాహ్మణులకు శ్రేయస్సు కలుగుగాక! పతివ్రతలకు శ్రేయస్సు కలుగుగాక! యుద్ధములందు వెనుకకు తిరుగని వారైన యోధులకు శ్రేయస్సు కలుగుగాక! నాకు ప్రాప్తించిన కాలమునకు శ్రేయస్సు కలుగుగాక! ఇదిగో నేను శాంతచిత్తుడను అగుచున్నాను.

**समरमुखमसह्यं पाण्डवानां प्रविश्य**
**प्रथितगुणगणाढ्यं धर्मराजं च बध्वा।**
**मम शरवरवेगैरर्जुनं पातयित्वा।**
**वनमिव हतसिंहं सुप्रवेशं करोमि ॥ 12 ॥**

సమరముఖమసహ్యం పాండవానాం ప్రవిశ్య
ప్రథితగుణగణాఢ్యం ధర్మరాజం చ బద్ధ్వా।
మమ శరవరవేగైరర్జునం పాతయిత్వా
వనమివ హతసింహం సుప్రవేశం కరోమి॥ ॥12॥

**భావము :** సహింపరాని పాండవుల సమరముఖమును ప్రవేశించి, ప్రసిద్ధి చెందిన గుణరాశితో కూడిన ధర్మరాజును బంధించి, నా బాణముల వేగముతో అర్జునుని పడగొట్టి చచ్చిన సింహముగల అడవిని వలె సులభమైన ప్రవేశము కలదిగా చేసెదను.

शल्यराज ! यावद्रथमारोहाव: ।
శల్యరాజ! యావద్రథమారోహావః.

**భావము :** ఓ శల్యరాజ! మనము రథము నధిరోహించుదమా?

**शल्य: -** बाढम् ।
**శల్యః -** బాఢమ్.
సరే (OK)

( उभौ रथारोहणं नाटयत: ।)

(ఉభౌ రథారోహణం నాటయతః.)

(ఇద్దరును రథమునెక్కుటను అభినయించుదురు)

**कर्ण:** - शल्यराज ! यत्रासावर्जुनस्तत्रैव चोद्यतां मम रथ: ।

**కర్ణః** - శల్యరాజ! యత్రాసావర్జునస్తత్రైవ చోద్యతాం మమ రథః.

यत्र + असौ + अर्जुन: + तत्र + एव ।

**భావము :** ఓ శల్యరాజ! ఎక్కడ అర్జునుడు కలడో, అక్కడకు నా రథమును పోనిమ్ము.

(नेपथ्ये) (నేపథ్యే)

(తెర వెనుక)

( भो: कर्ण ! महत्तरां भिक्षां याचे ।)

(భోః కర్ణ ! మహత్తరాం భిక్షాం యాచే.)

**భావము :** ఓ కర్ణ! మిక్కిలి గొప్పదైన భిక్షను కోరుచున్నాను.

**कर्ण:** - (आकर्ण्य) अये वीर्यवान् शब्द: ।

(ఆకర్ణ్య) అయే వీర్యవాన్ శబ్దః)

(విని) ఆహా! ఎంత శక్తిమంతమైన శబ్దము!)

श्रीमानेष न केवलं द्विजवर: ।आकर्ण्य धीरनिनदं स्वरमस्य चित्रार्पिताङ्गा इव तिष्ठन्ति सहसा यान्तो ममैते हया: ।

శ్రీమానేష న కేవలం ద్విజవరః. ఆకర్ణ్య ధీరనినదం స్వరమస్య చిత్రార్పితాంగా ఇవ తిష్ఠన్తి సహసా యాన్తో మమైతే హయాః.

**అర్థములు :** श्रीमान् = శోభగలవాడు, एष: = ఇతడు, केवलं द्विजवर: न = బ్రాహ్మణుడు మాత్రమే కాదు, अस्य = ఇతని యొక్క, धीरनिनदं = గంభీరధ్వనిగల, स्वरं = కంఠస్వరమును, आकर्ण्य = విని, मम = నా యొక్క, यान्त: = ప్రయాణిస్తున్న, एते हया: = ఈ గుర్రములు, चित्र + अर्पित + अंगा: इव = చిత్రమందు గీయబడిన దేహములుగల వానివలె, सहसा = వెంటనే, तिष्ठन्ति = నిలబడిపోయినవి.

**తాత్పర్యము :** శోభాసంపన్నుడైన ఇతడు బ్రాహ్మణుడు మాత్రమే కాదు. ఇతని గంభీర కంఠధ్వనిని విని వేగంగా వెళుతున్న అశ్వములు చిత్రంలో గీయబడిన వానివలె హఠాత్తుగా నిలబడిపోయినవి.

आहूयतां स विप्रः। न न। अहमेवाह्वयामि। भगवन्नित इतः।

ఆహూయతాం స విప్రః. న న. అహమేవాహ్వయామి. భగవన్నిత ఇతః.

భావము : ఆ బ్రాహ్మణుని ఆహ్వానించుము. వద్దు. వద్దు. నేనే పిలచెదను. పూజ్యుడా! ఇటు రమ్ము. ఇటు రమ్ము.

(ततः प्रविशति ब्राह्मणरूपेण शक्रः)

(తతః ప్రవిశతి బ్రాహ్మణ రూపేణ శక్రః.)

భావము : తర్వాత ఇంద్రుడు బ్రాహ్మణ రూపముతో ప్రవేశించును.

शक्रः - भो मेघाः! सूर्येणेव निवर्त्य गच्छन्तु भवन्तः (कर्णमुपगम्य) भोः कर्ण! महत्तरां भिक्षां याचे।)

శక్రః - భో మేఘాః! సూర్యేణేవ నివర్త్య గచ్ఛన్తు భవన్తః (కర్ణముపగమ్య) (భోః కర్ణ! మహత్తరాం భిక్షాం యాచే.)

భావము : ఓ మేఘములారా! మీరు సూర్యునితో కలసి మరలిపోవుదురుగాక! (కర్ణుని సమీపించి) ఓ కర్ణ! గొప్పదైన భిక్షను కోరుచున్నాను.

कर्णः - दृढं प्रीतोऽस्मि भगवन्!

కర్ణః - దృఢం ప్రీతోఽస్మి భగవన్!

పూజ్యుడా! బాగుగా సంతోషించితిని.

यातः कृतार्थगणनामहमद्य लोके
राजेन्द्रमौलिमणिरञ्जितपादपद्मः।
विप्रेन्द्रपादरजसा तु पवित्रमौलिः
कर्णो भवन्तमहमेष नमस्करोमि॥ ॥ 13 ॥

యాతః కృతార్థగణనామహమద్య లోకే
రాజేంద్రమౌలిమణిరంజితపాదపద్మః।
విప్రేంద్రపాదరజసా తు పవిత్రమౌలిః
కర్ణో భవన్తమహమేష నమస్కరోమి॥ ॥ 13 ॥

అన్వయ క్రమము : राजेन्द्रमौलि मणि रंजितपादपद्मः तु विप्रेन्द्रपादरजसा पवित्रमौलिः अहम् अद्य लोके कृतार्थगणनां यातः। एषः कर्णः अहं भवन्तं नमस्करोमि.

భావము : రాజశ్రేష్ఠుల కిరీటములలోని మణుల కాంతులచే రంజిల్లు పాదపద్మములను కలిగినవాడనైనను బ్రాహ్మణశ్రేష్ఠుని పాదధూళిచే పవిత్రమైన శిరస్సుగల నేను యిప్పుడు లోకములోని ధన్యుల లెక్కలో చేరితిని. ఇదిగో కర్ణుడనైన నేను నిన్ను నమస్కరించుచున్నాను.

**शक्रः** - (आत्मगतम्) किं नु खलु मया वक्तव्यं, यदि दीर्घायुर्भवेति वक्ष्ये दीर्घायुर्भविष्यति। यदि न वक्ष्ये मूढ इति मां परिभवति। तस्मादुभयं परिहृत्य किं नु खलु वक्ष्यामि। भवतु दृष्टम्। (प्रकाशम्)

भो: कर्ण! सूर्य इव, चन्द्र इव, हिमवान् इव, सागर इव तिष्ठतु ते यश:।

**శక్రః** - (ఆత్మగతమ్) కిం ను ఖలు మయా వక్తవ్యం, యది దీర్ఘాయుర్భవేతి వక్ష్యే దీర్ఘాయుర్భవిష్యతి. యది న వక్ష్యే మూఢ ఇతి మాం పరిభవతి. తస్మాదుభయం పరిహృత్య కిం ను ఖలు వక్ష్యామి. భవతు దృష్టమ్. (ప్రకాశమ్) భోః కర్ణ! సూర్య ఇవ, చంద్ర ఇవ, హిమవాన్ ఇవ, సాగర ఇవ తిష్ఠతు తే యశః.

భావము : (ఆత్మగతమ్ = తనలో) నేనేమి పలుకవలెనో కదా! దీర్ఘాయువగుదువుగాక అని పలికినచో ఇతడు దీర్ఘాయుష్కుడగును: అట్లుపలుకనిచో నన్ను మూర్ఖుడని అవమానించును. అందువలన ఆ రెంటిని వదలి నేను ఏమి పలుకగలను? కానిమ్ము. తెలిసినది. (ప్రకాశమ్ = పైకి) ఓయి కర్ణ! నీ కీర్తి సూర్యునివలె, చంద్రునివలె, హిమవంతుని వలె, సముద్రమువలె స్థిరముగా ఉండుగాక!

**कर्णः** - भगवन्! किं न वक्तव्यं दीर्घायुर्भवेति।
अथवा एतदेव शोभनम् । कुत: -

**కర్ణః** - భగవన్! కిం న వక్తవ్యం దీర్ఘాయుర్భవేతి.
అథవా ఏతదేవ శోభనం. కుతః -

భావము : పూజ్యుడా! దీర్ఘాయుష్కుడవగుము అని పలుకరాదా? అయినను యిదియే బాగున్నది. ఎందుకనగా -

**धर्मो हि यत्नै: पुरुषेण साध्यो**
**भुजंगजिह्वाचपला नृपश्रिय:।**
**तस्मात्प्रजापालनमात्रबुध्या**
**हतेषु देहेषु गुणा धरन्ते॥** ॥ 14 ॥

ధర్మో హి యత్నైః పురుషేణ సాధ్యో
భుజంగజిహ్వాచపలా నృపశ్రియః।
తస్మాత్ప్రజాపాలనమాత్రబుద్ధ్యా
హతేషు దేహేషు గుణా ధరన్తే॥ ॥ 14 ॥

భావము : ధర్మము పురుషునిచే అనేక ప్రయత్నములతో సాధించదగినది. రాజసంపదలు సర్పము యొక్క నాలుకవలె చంచలమైనవి. అందువలన ప్రజాపాలనమునందే బుద్ధిని నిలిపి రాజ్యమును ఏలవలెను. ఎందుకనగా దేహములు నశించినను గుణములు కలకాలము నిలుచునుకదా!

भगवन्, किमिच्छसि। किमहं ददामि।

భగవన్, కిమిచ్ఛసి, కిమహం దదామి.

భావము : పూజ్యుడా! ఏమి కోరుచున్నావు? నేనేమి ఇవ్వవలెను?

शक्रः - (महत्तरां भिक्षां याचे।)

శక్రః - (మహత్తరాం భిక్షాం యాచే.)

భావము : మిక్కిలి గొప్పదైన భిక్షను కోరుచున్నాను.

कर्णः - महत्तरां भिक्षां भवते प्रदास्ये। श्रूयन्तां मद्विभवाः।

కర్ణః - మహత్తరాం భిక్షాం భవతే ప్రదాస్యే. శ్రూయన్తాం మద్విభవాః.

భావము : నీకు గొప్పభిక్షనే ఇవ్వగలను. నా సంపదలను గూర్చి వినుము.

गुणवदमृतकल्पक्षीरधाराभिवर्षि
द्विजवर! रुचितं ते तृप्तवत्सानुयात्रम्।
तरुणमधिकमर्थिप्रार्थनीयं पवित्रं
विहितकनकशृङ्गं गोसहस्रं ददामि॥ ॥15॥

గుణవదమృతకల్పక్షీరధారాభివర్షి
ద్విజవర! రుచితం తే తృప్తవత్సానుయాత్రమ్।
తరుణమధికమర్థిప్రార్థనీయం పవిత్రం
విహితకనకశృంగం గోసహస్రం దదామి॥ ॥ 15 ॥

అర్థములు : द्विजवर ! = ఓ బ్రాహ్మణ శ్రేష్ఠుడా!, ते = నీకు, रुचितं (चेत्) = ఇష్టమైనచో, गुणवत् = గుణములుగల, अमृत = అమృతముతో, कल्प = సమానమైన, क्षीरधारा अभिवर्षि = పాలధారలను కురియునట్టి, तृप्त = తృప్తి చెందిన, वत्स = దూడలచే, अनुयात्रम् = అనుసరించబడునట్టి, तरुणम् = వయస్సులో ఉన్నట్టి, अधिकम् = అధికముగా, अर्थिप्रार्थनीयं = యాచకులచే కోరదగినట్టి, पवित्रं = పవిత్రమైనట్టి, विहितकनकशृङ्गं = అలంకరించబడిన బంగారపు కొమ్ములుగల, गोसहस्रं = వేయి ఆవులను, ददामि = ఇచ్చెదను.

భావము : ఓ బ్రాహ్మణ శ్రేష్ఠ! నీకు యిష్టమైనచో, అమృత సమానమైన పాలధారలను కురియునట్టి, తృప్తిచెందిన దూడలచే అనుసరించబడునట్టి, వయస్సులో ఉన్నట్టి, యాచకులచే కోరదగినట్టి, మిక్కిలి పవిత్రమైనట్టి, బంగారపు కొమ్ములను అలంకరించిన వేయి గోవులను దానముచేసెదను.

**शक्रः** – (गोसहस्रमिति । मुहूर्तकं क्षीरं पिबामि । नेच्छामि कर्ण ! नेच्छामि ।)

శక్రః – (గోసహస్రమితి. ముహూర్తకం క్షీరం పిబామి. నేచ్ఛామి కర్ణ! నేచ్ఛామి.)

భావము : వేయి గోవులా? ముహూర్తకాలము వాటి పాలను త్రాగెదను. నేను ఇష్టపడుటలేదు కర్ణా! నేను ఇష్టపడుటలేదు.

मुहूर्तकं = ముహూర్తకాలము అనగా రెండు గడియల కాలము. అనగా 48 నిముషముల కాలము.

**कर्णः** – किं नेच्छति भवान् । इदमपि श्रूयताम् ।

కర్ణః – కిం నేచ్ఛతి భవాన్. ఇదమపి శ్రూయతామ్.

భావము : నీవు యిష్టపడుటలేదా? దీనిని కూడ వినుము.

नेच्छति = न + इच्छति ।

**रवितुरगसमानं साधनं राजलक्ष्म्याः**
**सकलनृपतिमान्यं मान्यकाम्बोजजातम् ।**
**सुगुणमनिलवेगं युद्धदृष्टापदानं**
**सपदि बहु सहस्रं वाजिनां ते ददामि ॥ ॥ 19 ॥**

రవితురగసమానం సాధనం రాజలక్ష్మ్యాః
సకలనృపతిమాన్యం మాన్యకాంబోజజాతమ్।
సుగుణమనిలవేగం యుద్ధదృష్టాపదానం
సపది బహు సహస్రం వాజినాం తే దదామి॥ ॥ 19 ॥

భావము : సూర్యుని గుఱ్ఱములతో సమానములైన, రాజ్యలక్ష్మికి సాధనములైన, సమస్త రాజులచే గౌరవించదగిన, ప్రశస్తమైన కాంబోజ వంశమున జన్మించిన, మంచి గుణములుగల, వాయువేగముగల, యుద్ధములందు చూపబడిన పరాక్రమముగల వేనకు వేల అశ్వములను వెంటనే నీకు యిచ్చెదను.

शक्र: - (अश्व इति। मुहूर्तकमारोहामि। नेच्छामि कर्ण! नेच्छामि।)

శక్రః - (అశ్వ ఇతి. ముహూర్తకమారోహామి. నేచ్ఛామి కర్ణ! నేచ్ఛామి.)

భావము : గుఱ్ఱములా? ముహూర్తకాలము అధిరోహించెదను. నేను యిష్టపడుటలేదు కర్ణా! ఇష్టపడుటలేదు.

कर्ण: - किं नेच्छति भवान्। अन्यदपि श्रूयताम्।

కర్ణః - కిం నేచ్ఛతి భవాన్. అన్యదపి శ్రూయతామ్.

భావము : నీవు ఇష్టపడుటలేదా? (అయినచో) మరియొకటి కూడ వినుము.

**मदसरितकपोलं षट्पदैः सेव्यमानं**
**गिरिवरनिचयाभं मेघगम्भीरघोषम्।**
**सितनखदशनानां वारणानामनेकं**
**रिपुसमरविमर्दं बृन्दमेतद्ददामि॥ ॥20॥**

మదసరితకపోలం షట్పదైః సేవ్యమానం
గిరివరనిచయాభం మేఘగంభీరఘోషమ్।
సితనఖదశనానాం వారణానామనేకం
రిపుసమరవిమర్దం బృన్దమేతద్దదామి॥ ॥ 20 ॥

భావము : మదధారలచే తడిసిన చెక్కిళ్ళుగల, తుమ్మెదలచే సేవింపబడుచున్న, పర్వతరాజముల సమూహామువలెనున్న, మేఘగర్జనవలె గంభీరమైన ఘీంకారములుగల, తెల్లని గోళ్ళను, దంతములను కలిగినట్టి, శత్రుయుద్ధములను నశింపజేయునట్టి అసంఖ్యాకములైన గజబృందములను నీకు దానము చేసెదను.

शक्र: - (गज इति। मुहूर्तकमारोहामि। नेच्छामि कर्ण! नेच्छामि।)

శక్రః - (గజ ఇతి. ముహూర్తకమారోహామి. నేచ్ఛామి కర్ణ! నేచ్ఛామి.)

భావము : ఏనుగులా? ముహూర్తకాలము అధిరోహించెదను. (దాని వలన ఏమి ప్రయోజనమని భావము). నేను ఇష్టపడుటలేదు కర్ణా! ఇష్టపడుటలేదు.

**అర్థములు :** **द्विजवर !** = ఓ బ్రాహ్మణ శ్రేష్ఠుడా!, **ते** = నీకు, **रुचितं (चेत्)** = ఇష్టమైనచో, **गुणवत्** = గుణములుగల, **अमृत** = అమృతముతో, **कल्प** = సమానమైన, **क्षीरधारा अभिवर्षि** = పాలధారలను కురియునట్టి, **तृप्त** = తృప్తి చెందిన, **वत्स** = దూడలచే, **अनुयात्रम्** = అనుసరించబడునట్టి, **तरुणम्** = వయస్సులో ఉన్నట్టి, **अधिकम्** = అధికముగా, **अर्थिप्रार्थनीयं** = యాచకులచే కోరదగినట్టి, **पवित्रं** = పవిత్రమైనట్టి, **विहितकनकशृंङ्गं** = అలంకరించబడిన బంగారపు కొమ్ములుగల, **गोसहस्रं** = వేయి ఆవులను, **ददामि** = ఇచ్చెదను.

**భావము :** ఓ బ్రాహ్మణ శ్రేష్ఠ! నీకు యిష్టమైనచో, అమృత సమానమైన పాలధారలను కురియునట్టి, తృప్తిచెందిన దూడలచే అనుసరించబడునట్టి, వయస్సులో ఉన్నట్టి, యాచకులచే కోరదగినట్టి, మిక్కిలి పవిత్రమైనట్టి, బంగారపు కొమ్ములను అలంకరించిన వేయి గోవులను దానముచేసెదను.

**शक्रः -** (गोसहस्रमिति । मुहूर्तकं क्षीरं पिबामि । नेच्छामि कर्ण ! नेच्छामि ।)

**శక్రః -** (గోసహస్రమితి. ముహూర్తకం క్షీరం పిబామి. నేచ్ఛామి కర్ణ! నేచ్ఛామి.)

భావము : వేయి గోవులా? ముహూర్తకాలము వాటి పాలను త్రాగెదను. నేను ఇష్టపడుటలేదు కర్ణా! నేను ఇష్టపడుటలేదు.

मुहूर्तकं = ముహూర్తకాలము అనగా రెండు గడియల కాలము. అనగా 48 నిముషముల కాలము.

**कर्णः -** किं नेच्छति भवान् । इदमपि श्रूयताम् ।

**కర్ణః -** కిం నేచ్ఛతి భవాన్. ఇదమపి శ్రూయతామ్.

భావము : నీవు యిష్టపడుటలేదా? దీనిని కూడ వినుము.

नेच्छति = न + इच्छति ।

**रवितुरगसमानं साधनं राजलक्ष्म्याः**
**सकलनृपतिमान्यं मान्यकाम्बोजजातम् ।**
**सुगुणमनिलवेगं युद्धदृष्टापदानं**
**सपदि बहु सहस्रं वाजिनां ते ददामि ॥** ॥ 19 ॥

**రవితురగసమానం సాధనం రాజలక్ష్మ్యాః**
**సకలనృపతిమాన్యం మాన్యకాంబోజజాతమ్।**
**సుగుణమనిలవేగం యుద్ధదృష్టాపదానం**
**సపది బహు సహస్రం వాజినాం తే దదామి॥** ॥ 19 ॥

భావము : సూర్యుని గుఱ్ఱములతో సమానములైన, రాజ్యలక్ష్మికి సాధనములైన, సమస్త రాజులచే గౌరవించదగిన, ప్రశస్తమైన కాంబోజ వంశమున జన్మించిన, మంచి గుణములుగల, వాయువేగముగల, యుద్ధములందు చూపబడిన పరాక్రమముగల వేనకు వేల అశ్వములను వెంటనే నీకు యిచ్చెదను.

शक्रः - (अश्व इति। मुहूर्तकमारोहामि। नेच्छामि कर्ण! नेच्छामि।)

శక్రః - (అశ్వ ఇతి. ముహూర్తకమారోహామి. నేచ్ఛామి కర్ణ! నేచ్ఛామి.)

భావము : గుఱ్ఱములా? ముహూర్తకాలము అధిరోహించెదను. నేను యిష్టపడుటలేదు కర్ణా! ఇష్టపడుటలేదు.

कर्णः - किं नेच्छति भवान्। अन्यदपि श्रूयताम्।

కర్ణః - కిం నేచ్ఛతి భవాన్. అన్యదపి శ్రూయతామ్.

భావము : నీవు ఇష్టపడుటలేదా? (అయినచో) మరియొకటి కూడ వినుము.

मदसरितकपोलं षट्पदैः सेव्यमानं
गिरिवरनिचयाभं मेघगम्भीरघोषम्।
सितनखदशनानां वारणानामनेकं
रिपुसमरविमर्दं बृन्दमेतद्ददामि॥ ॥ 20 ॥

మదసరితకపోలం షట్పదైః సేవ్యమానం
గిరివరనిచయాభం మేఘగంభీరఘోషమ్।
సితనఖదశనానాం వారణానామనేకం
రిపుసమరవిమర్దం బృన్దమేతద్దదామి॥ ॥ 20 ॥

భావము : మదధారలచే తడిసిన చెక్కిళ్ళుగల, తుమ్మెదలచే సేవింపబడుచున్న, పర్వతరాజముల సమూహమువలెనున్న, మేఘగర్జనవలె గంభీరమైన ఘీంకారములుగల, తెల్లని గోళ్ళను, దంతములను కలిగినట్టి, శత్రుయుద్ధములను నశింపజేయునట్టి అసంఖ్యాకములైన గజబృందములను నీకు దానము చేసెదను.

शक्रः - (गज इति। मुहूर्तकमारोहामि। नेच्छामि कर्ण! नेच्छामि।)

శక్రః - (గజ ఇతి. ముహూర్తకమారోహామి. నేచ్ఛామి కర్ణ! నేచ్ఛామి.)

భావము : ఏనుగులా? ముహూర్తకాలము అధిరోహించెదను. (దాని వలన ఏమి ప్రయోజనమని భావము). నేను ఇష్టపడుటలేదు కర్ణా! ఇష్టపడుటలేదు.

कर्णः - किं नेच्छति भवान्। अन्यदपि श्रूयताम्। अपर्याप्तं कनकं ददामि।

కర్ణః - కిం నేచ్ఛతి భవాన్. అన్యదపి శ్రూయతామ్. అపర్యాప్తం కనకం దదామి.

భావము : ఏమి? నీవు యిష్టపడుటలేదా? వేరొకటి వినుము. అపరిమితమైన బంగారమును యిచ్చెదను.

शक्रः - (गृहीत्वा गच्छामि। नेच्छामि कर्ण! नेच्छामि।)

శక్రః - (గృహీత్వా గచ్ఛామి. నేచ్ఛామి కర్ణ! నేచ్ఛామి.)

భావము : తీసికొని వెళ్ళెదను. (ఏమి ప్రయోజనము?) నేను యిష్టపడుటలేదు కర్ణా! యిష్టపడుటలేదు.

कर्णः - तेन हि जित्वा पृथिवीं ददामि।

కర్ణః - తేన హి జిత్వా పృథివీం దదామి.

భావము : అట్లైనచో, భూమిని జయించి దానము చేసెదను.

शक्रः - पृथिव्या किं करिष्यामि?

శక్రః - (పృథివ్యా కిం కరిష్యామి?)

భావము : భూమితో ఏమి చేయగలను?

कर्णः - तेन ह्यग्निष्टोमफलं ददामि।

కర్ణః - తేన హ్యగ్నిష్టోమఫలం దదామి.

భావము : అట్లైనచో, అగ్నిష్టోమము యొక్క ఫలమును నీకు దానము చేసెదను.

शक्रः - अग्निष्टोमफलेन किं कार्यम्?

శక్రః - (అగ్నిష్టోమఫలేన కిం కార్యమ్?)

భావము : అగ్నిష్టోమము యొక్క ఫలముతో ఏమి చేయదగును?

कर्णः - तेन हि मच्छिरो ददामि।

కర్ణః - తేన హి మచ్ఛిరో దదామి.

భావము : అట్లైనచో నా శిరస్సును ఇచ్చెదను.

शक्रः - अविहा अविहा।

శక్రః - అవిహా అవిహా.

భావము :, అయ్యో! అయ్యో!

कर्णः - न भेतव्यं न भेतव्यम्। प्रसीदतु भवान्। अन्यदपि श्रूयताम्।

కర్ణః - న భేతవ్యం న భేతవ్యం. ప్రసీదతు భవాన్. అన్యదపి శ్రూయతామ్.

భావము : భయపడవలదు. భయపడవలదు. నీవు ప్రసన్నుడవగుము. వేరొకటి కూడ వినుము.

अङ्गैः सहैव जनितं मम देहरक्षा
देवासुरैरपि न भेद्यमिदं सहास्त्रैः।
देयं तथापि कवचं सह कुण्डलाभ्यां
प्रीत्या मया भगवते रुचितं यदि स्यात्॥ ॥21॥

అంగైః సహైవ జనితం మమ దేహరక్షా
దేవాసురైరపి న భేద్యమిదం సహాస్త్రైః
దేయం తథాపి కవచం సహ కుండలాభ్యాం
ప్రీత్యా మయా భగవతే రుచితం యది స్యాత్॥ ॥21॥

**అర్థములు :** मम = నా యొక్క, देहरक्षा = శరీర కవచము, अंगैः सह + एव = అవయవములతోడనే, जनितं = పుట్టినది (కలిగినది), इदं = ఇది, देव + असुरैः + अपि = దేవతలచేత, రాక్షసులచేత కూడ, अस्त्रैः = అస్త్రములచే, न भेद्यम् = భేదించదగినది కాదు, तथापि (तथा + अपि) = అయినప్పటికి, यदि = ఒకవేళ, भगवते = పూజ్యుని కొరకు (మీకు), रुचितं स्यात् = ఇష్టమైనచో, प्रीत्या = ప్రీతితో, मया = నాచే, कवचं = కవచము, कुण्डलाभ्यां सह = కుండలములతో కూడ, देयम् = ఇవ్వదగినది.

**తాత్పర్యము :** నా శరీరకవచము నా అవయవములతోనే సహజముగా పుట్టినది. ఇది దేవతలచేతగాని, రాక్షసులచేతగాని అస్త్రప్రయోగముచే భేదించుటకు సాధ్యము కానిది. అయినప్పటికి, మీకు యిష్టమైనచో యీ కవచమును కుండలములతో కూడ ప్రీతితో ఇవ్వగలను.

शक्रः - (सहर्षम्) (ददातु, ददातु।)

శక్రః - (సహర్షమ్) (దదాతు, దదాతు.)

**భావము :** (ఆనందముగా) ఇవ్వుము. ఇవ్వుము.

कर्णः - (आत्मगतम्) एष एवास्य कामः। किं नु खल्वनेककपटबुद्धेः कृष्णस्योपायः सोऽपि भवतु। धिगयुक्तमनुशोचितुम्। नास्ति संशयः। (प्रकाशम्) गृह्यताम्।

కర్ణః - (ఆత్మగతమ్) ఏష ఏవాస్య కామః. కిం ను ఖల్వనేకకపటబుద్ధేః కృష్ణస్యో-పాయః సోఽపి భవతు. ధిగయుక్తమనుశోచితుమ్. నాస్తి సంశయః. (ప్రకాశమ్) గృహ్యతామ్.

భావము : (తనలో) ఇదే యితని కోరిక. అనేక కపటబుద్ధులుగల కృష్ణుని ఉపాయమేమో! అది కూడ కావచ్చును. ఛ. పశ్చాత్తాపపడుట అయుక్తము. సందేహము లేదు. (ప్రకాశముగా) స్వీకరించబడుగాక!

शल्यः - अङ्गराज! न दातव्यं न दातव्यम्।

శల్యః - అంగరాజ! న దాతవ్యం న దాతవ్యమ్.

భావము : ఓ అంగరాజ! ఇవ్వవద్దు. ఇవ్వవద్దు.

कर्णः - शल्यराज! अलमलं वारयितुम्। पश्य-

కర్ణః - శల్యరాజ! అలమలమ్ వారయితుమ్. పశ్య-

భావము : ఓ శల్యరాజ! చాలు చాలు నివారించుట (నివారించవలదు) చూడుము-

शिक्षा क्षयं गच्छति कालपर्ययात्
सुबद्धमूला निपतन्ति पादपाः।
जलं जलस्थानगतं च शुष्यति
हुतं च दत्तं च तथैव तिष्ठति॥ ॥22॥

శిక్షా క్షయం గచ్ఛతి కాలపర్యయాత్
సుబద్ధమూలా నిపతన్తి పాదపాః।
జలం జలస్థానగతం చ శుష్యతి
హుతం చ దత్తం చ తథైవ తిష్ఠతి॥ ॥22॥

భావము : అభ్యసించబడిన విద్య కాలము గడచినకొలది విస్మరించబడును. దృఢమైన మూలభాగముగల చెట్లు పడిపోవును. జలాశయములందుగల నీరు ఎండిపోవును. కాని హోమాగ్నులందు వేయబడిన హవిస్సు, అర్హులకు చేయబడిన దానము అట్లే ఉండును.

तस्मात् गृह्यताम्। (निकृत्य ददाति)

తస్మాత్ గృహ్యతామ్. (నికృత్య దదాతి)

అందువలన స్వీకరించుము. (లాగి యిచ్చును.)

शक्रः - (गृहीत्वा आत्मगतम्।) हन्त गृहीते एते। पूर्वमेवाहमर्जुनविजयाय सर्वदेवैर्यत् समर्थितं तदिदानीं मयानुष्ठितम्। तस्मादहमप्यैरावतमा - रुह्यार्जुनकर्णयोर्द्वन्द्वयुद्धं पश्यामि। (निष्क्रान्तः।)

శక్రః - (గృహీత్వా ఆత్మగతమ్.) హన్త గృహీతే ఏతే. పూర్వమేవాహమర్జునవిజయాయ సర్వదేవైర్యత్ సమర్థితం తదిదానీం మయానుష్ఠితమ్. తస్మాదహమప్యైరావత - మారుహ్యార్జునకర్ణయోర్ద్వంద్వయుద్ధం పశ్యామి. (నిష్క్రాన్తః.)

భావము : (కవచకుండలములను తీసుకొని తనలో) అయ్యో! వీటిని స్వీకరించితినే! పూర్వమే అర్జునుని విజయము కొరకు సమస్తదేవతలచే ఏది సమర్థించబడినదో, అది యిప్పుడు నాచే ఆచరించబడినది. అందువలన నేను కూడ ఐరావతము నెక్కి కర్ణార్జునుల ద్వంద్వయుద్ధమును చూచెదను.

(నిష్క్రమించును.)

शल्यः - भो अङ्गराज! वञ्चितः खलु भवान्।

శల్యః - భో అంగరాజ! వంచితః ఖలు భవాన్.

భావము : ఓ అంగరాజ! నీవు మోసగించబడినావు కదా!

कर्णः - केन?

కర్ణః - కేన?

ఎవనిచేత?

शल्यः - शक्रेण।

శల్యః - శక్రేణ.

ఇంద్రునిచేత.

कर्णः - न खलु। शक्रः खलु मया वञ्चितः। कुतः,

కర్ణః - న ఖలు. శక్రః ఖలు మయా వంచితః. కుతః,

భావము : నేను కాదు. ఇంద్రుడు నాచే మోసగించబడెను కదా! ఎందుకనగా.-

अनेकयज्ञाहुतितर्पितो द्विजैः
किरीटिमान् दानवसंघमर्दनः।
सुरद्विपास्फालनकर्कशाङ्गुलि-
र्मया कृतार्थः खलु पाकशासनः॥ ॥23॥

అనేకయజ్ఞాహుతితర్పితో ద్విజైః
కిరీటిమాన్ దానవసంఘమర్దనః।
సురద్విపాస్ఫాలనకర్కశాంగులి -
ర్మయా కృతార్థం ఖలు పాకశాసనః॥ ॥ 23 ॥

**అర్థములు :** द्विजैः = బ్రాహ్మణులచేత, अनेकयज्ञ + आहुति = అనేక యజ్ఞములందు ఆహుతులచే (ఆహుతి = అగ్నియందు వేయబడు ద్రవ్యము), तर्पितः = తృప్తిపరచబడినవాడు, किरीटिमान् = కిరీటిని అనగా అర్జునుని కలిగినవాడు, दानवसंघ = రాక్షసుల సమూహములను, मर्दनः = నాశనము చేసినవాడు, सुरद्विप = ఐరావతమును, आस्फालन = చరచుటచే, कर्कश + अंगुलिः = కఠినములైన వ్రేళ్ళుగల, पाकशासनः = ఇంద్రుడు, मया = నాచేత, कृतार्थः खलु = ధన్యుడయ్యెను కదా!

**తాత్పర్యము :** బ్రాహ్మణులచే అనేక యజ్ఞములందు ఆహుతులచే తృప్తిపరచబడినవాడు, కిరీటిని పుత్రునిగా కలిగినవాడు, రాక్షసుల సమూహములను నాశనము చేసినవాడు, ఐరావతమును చరచుటచే కఠినములైన చేతివ్రేళ్ళుగలవాడునైన ఇంద్రుడు నా వలన ధన్యతను పొందెను కదా!

(प्रविश्य ब्राह्मणरूपेण)

(ప్రవిశ్య బ్రాహ్మణరూపేణ)

(బ్రాహ్మణ రూపముతో ప్రవేశించి)

**देवदूत:** – भो कर्ण ! कवचकुण्डलग्रहणाज्जनितपश्चात्तापेन पुरंदरेणानुगृहीतोऽसि। पाण्डवेष्वेकपुरुषवधार्थममोघमस्त्रं विमला नाम शक्तिरियं प्रत्तिगृह्यताम्।

**దేవదూతః** – భో కర్ణ! కవచకుండల గ్రహణాజ్జనితపశ్చాత్తాపేన పురందరేణానుగృహీతో ఽస్మి పాండవేష్వేకపురుషవధార్థమమోఘమస్త్రం విమలా నామ శక్తిరియం ప్రతిగృహ్యతామ్.

**భావము :** ఓ కర్ణ! కవచకుండలములను గ్రహించుట వలన కలిగిన పశ్చాత్తాపము గల ఇంద్రునిచే అనుగ్రహించబడినావు. పాండవులలో ఒక పురుషుని వధించుటకు సాధనమైన, నిష్ఫలము కాని అస్త్రమైన 'విమల' అను యీ శక్తిని ప్రతిఫలముగా గ్రహించుము.

**कर्ण:** – धिग्, दत्तस्य न प्रतिगृह्णामि।

**కర్ణః** – ధిగ్, దత్తస్య న ప్రతిగృహ్ణామి.

**భావము :** ఛ, ఇచ్చిన దానికి ప్రతిఫలమును గ్రహించను.

**देवदूत:** – ननु ब्राह्मणवचनाद् गृह्यताम्।

**దేవదూతః** – నను బ్రాహ్మణవచనాద్ గృహ్యతామ్.

**భావము :** ఓయి! బ్రాహ్మణుని మాటవలన గ్రహించుము.

**कर्ण:** – ब्राह्मणवचनमिति। न मयातिक्रान्तपूर्वम्। कदा लभेय ?

**కర్ణః** – బ్రాహ్మణవచనమితి న మయాతిక్రాంతపూర్వమ్. కదా లభేయ?

मया + अतिक्रान्तपूर्वम् = मयातिक्रान्तपूर्वम्।

**భావము :** బ్రాహ్మణుని వచనమా? పూర్వమెన్నడును అతిక్రమించలేదు. ఎప్పుడు పొందవలెను?

**देवदूत:** – यदा स्मरसि तदा लभस्व।

**దేవదూతః** – యదా స్మరసి తదా లభస్వ.

**భావము :** ఎప్పుడు స్మరించెదవో అప్పుడు పొందుము.

कर्णः - बाढम्। अनुगृहीतोऽस्मि। प्रतिनिवर्ततां भवान्।

కర్ణః - బాఢమ్. అనుగృహీతోఽ స్మి. ప్రతినివర్తతాం భవాన్.

భావము : అలాగే. అనుగ్రహించబడితిని. నీవు మరలిపొమ్ము.

देवदूतः - बाढम्। (निष्क्रान्तः।)

దేవదూతః - బాఢమ్. (నిష్క్రాన్తః)

భావము : అలాగే. (నిష్క్రమించును)

कर्णः - शल्यराज! (यावद्रथमारोहावः)

కర్ణః - శల్యరాజ! (యావద్రథమారోహావః)

భావము : ఓ శల్యరాజ! ఇక రథమును ఎక్కుదము.

शल्यः - बाढम्। (रथारोहणं नाटयतः)

శల్యః - బాఢమ్. (రథారోహణం నాటయతః)

భావము : అలాగే. (రథమును ఎక్కుటను అభినయించుదురు.)

कर्णः - अये शब्द इव श्रूयते। किं नु खल्विदम्।

కర్ణః - అయే శబ్ద ఇవ శ్రూయతే. కిం ను ఖల్విదమ్.

భావము : అరె! శబ్దము వలె వినబడుచున్నది. ఇది ఏమిటో కదా!

शङ्खध्वनिः प्रलयसागरघोषतुल्यः
कृष्णस्य वा न तु भवेत्स तु फाल्गुनस्य।
नूनं युधिष्ठिरपराजयकोपितात्मा
पार्थः करिष्यति यथाबलमद्य युद्धम्॥ ॥24॥

శంఖధ్వనిః ప్రలయసాగరఘోషతుల్యః
కృష్ణస్య వా న తు భవేత్స తు ఫాల్గునస్య
నూనం యుధిష్ఠిరపరాజయకోపితాత్మా
పార్థః కరిష్యతి యథాబలమద్య యుద్ధమ్॥ ॥24॥

భావము : ప్రళయకాలమందలి సముద్రఘోషతో సమానమైన ఆ శంఖధ్వని కృష్ణునిది కావచ్చును. కానిచో అర్జునునిది కావచ్చును. యుధిష్ఠిరుని పరాజయముచే కోపగించిన అర్జునుడు నిశ్చయముగా నేడు శక్తికొలది యుద్ధము చేయగలడు.

అనగా బలమునంతయు కూడగట్టుకొని యుద్ధము చేయునని భావము.

शल्यराज ! यत्रासावर्जुनस्तत्रैव चोद्यतां मम रथः ।

శల్యరాజ! యత్రాసావర్జునస్తత్రైవ చోద్యతాం మమ రథః.

यत्र + असौ + अर्जुनः + तत्र + एव

భావము : ఓ శల్యరాజ! అర్జునుడు ఎక్కడ ఉన్నాడో, నా రథమును అక్కడకు నడుపుము.

शल्यः - बाढम् ।

శల్యః - బాఢమ్.

అలాగే.

(भरतवाक्यम्)

(భరతవాక్యమ్)

**सर्वत्र सम्पदः सन्तु नश्यन्तु विपदः सदा ।**
**राजा राजगुणोपेतो भूमिमेकः प्रशास्तु नः ॥ ॥ 25 ॥**

సర్వత్ర సంపదః సన్తు నశ్యన్తు విపదః సదా।
రాజా రాజగుణోపేతో భూమిమేకః ప్రశాస్తు నః ॥ 25 ॥

భావము : అంతట సంపదలు కలుగుగాక! ఎల్లప్పుడు ఆపదలు నశించుగాక! రాజగుణములతో కూడిన రాజొక్కడే భూమిని పరిపాలించుగాక!

(निष्क्रान्तौ ।)

(నిష్క్రాన్తౌ)

(వారిద్దరు నిష్క్రమించిరి)

**कर्णभारमवसितम् ।**

(కర్ణభారమవసితమ్)

కర్ణభారమను రూపకము సమాప్తమైనది.